## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014958

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్.

శ్రీగణపతయేనమః

జమ్ములమడక

# శ్రీ ఆంజనేయశతకము.


రచయితలు

బ్రహ్మశ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు.

(పలునాటి సోదరకవులు)



ప్రకాశకులు

—♦ పల్నాడుతాలూకా జమ్ములమడక వాస్తవ్యులు ♦—

ప్రథమముద్రణము 500 ప్రతులు.



ఓం.

శ్రీ ఆంజనేయపరబ్రహ్మణేనమః.

# శ్రీ ఆంజనేయశతకము.

శా॥ శ్రీరాముండు మహానుభావుఁడు కృపా ♦ సింధుండు తాఁ జానకీ
నారీరత్నముఁ గూడి సంతతము హృ ♦ న్నాళీకమందుండి దో
స్సారంబు ల్విమలాత్మయు న్నొసఁగ ర ♦ క్షన్నీయు నీభక్తియు
మారా జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 1

శా॥ సీతత్త్వమ్మును నీమహామహిమనీ ♦ నిర్మాల్యపుంభక్తి నీ
నీతిన్ నీరణకోవిదత్వమును వ ♦ ర్ణింపంగలోనెంచి నే
చేతన్వ్రాసితి నీకలంబును యశ ♦ శ్శ్రీ! సాధ్యమో కాదొ వి
ఖ్యాతా! జమ్ములమడ్క- పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 2

మ॥ మతిహీనుండను నీకు భక్తుఁడను న ♦ న్మన్నించుమా నాథ న
న్నతితీవ్రాంగఁ దోలుమా యనుచు నీ ♦ పైఁబద్యముల్గాస్త నే
శతముల్ నికరుణావిశేషములతో సా ♦ కస్గదేదేవ! శా
శ్వత! శ్రీజమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 3

మ॥ స్థిరచిత్తుండను గాదునిన్ సతతము ♦ న్సేవింపనైశ్వర్యసం
భరితుండన్ మతికాదు నీకుఁ గుసుల ♦ న్బ్రాకారముల్గట్ట న
స్థిరరక్షింపఁగ నూఱికేయగున యీ ♦ పద్యాలఁగొమ్మో కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 4

మ॥ అకలంకాత్ముఁడు రాజయాఖ్యుసకు ది ♦ వ్యస్వాంతశ్రీకోటమాం
బకుఁ బుత్రుండను మల్లికార్జునసరుల్ ♦ భవ్యాత్మభాగీరథం
బకుఁబౌత్రుండనుకన్నకంటికులుఁడన్ ♦ 'మాంపాహిమాంపాహి' ర
క్షక శ్రీజమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 5

మ॥ అమలాత్ముండవు నీవు సచ్ఛీలివియౌ ♦ హా! బ్రహ్మచర్యవ్రతం
బుమహాకష్టము సేసితెంతవలఁ కున్ ♦ ఫాల్గుణాండ్ల చేఁజిక్కఁ బో
కమహాభాగ యుకేత్రుబలైన గెలుకం ♦ గాఁజేయుమానా వివా
హాము శ్రీజమ్ములమడ్క-పూర్వపురవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 6

శా॥ ఏకాగ్ర్యంబులఁ జేయఁగూడినను ని ♦ న్నేకాంతమూా భక్తితో
నీకన్గొల్చిన మాతృనేకడలి వె ♦ న్వాటుక్ ప్రవేశించి యూా
యూకార్యంబులు సాగఁజేతువట దీ ♦ వ్యత్రేమతోఁ జూమటన్
గాఁకేజమ్ములమడ్క-పూర్ణిలయుం ♦ డా! ఆంజనేయప్రభూ! 7

శా॥ నీవేతల్లివి నీవతండ్రివిప్రభూ ♦ నీవేన్వమిత్రుండవౌ
నీవే మోక్షప్రదప్రదాయకుఁడవి ♦ వేయూాదిశోద్యుఁడవౌ
దీవే నిస్తులుడౌ శక్యమొకో తం ♦ డ్రీ! నన్నురక్షింపఁగా
రావా జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥

మ॥ అనయంబున్ భవదీయాసంస్మరణజే ♦ యన్ గోరుభక్తాళిపై
ఘనమూా నీకృపనుంచిప్రోవగను చే ♦ ఖడ్గంబునున్ దాల్చి వా
రినిరక్షించుచు శత్రులన్ దునిమి ను ♦ శ్రీఁగూర్తువెల్లప్పుడో
యనఘా జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ! 9

శా॥ ఓతండ్రీ! సకలప్రపంచమున ని ♦ ర్వాణవద్భక్త్యాఢ్యవై
జ్ఞాతత్వాంబున కండకుండెదవునీ ♦ సాయూజ్యమేకీతిదో
నీతత్వమ్మెటువంటిదో తెలియ న ♦ శక్యంపంగశక్యంబె వి
ఖ్యాతా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 10

మ॥ శివవీర్యంబున నంజనా సుదతికిన్ ♦ శ్రీమీరగా వేడ్కను
ద్భవమై బాల్యము నందసూర్యునిఫల ♦ భ్రాంతిన్ విలోకించి సాఁ
డవు నిరూపముఁగాంచినంతనె యుజాం ♦ డంబెల్లభీతిల్లవై
భవ! శ్రీజమ్ములమడ్క-పూర్ణిలయ దే ♦ వా ఆంజనేయప్రభూ! 11

మ॥ తనువుం దాలిచి తల్లిగర్భమున నా • స్తవ్యాంఘ్రినైయున్న స
న్నునఁ జేసీ కడు విశ్వకర్మభగవా • నుండెమ్మిక శీనముఁ
గనిదానిఁ ధరియించి వెల్గితివి శ్రీం • గారంపు రూపంబుతో
ననఘా జమ్ములమడ్క పూర్వగవిహా • రా ఆంజనేయప్రభూ! 12

మ॥ హారముఖ్యుల్ గనుచుండ నప్పుడు నా • ట్యాంబాడగా కిన్నరే
శ్వరయక్షప్రముఖుల్ ముదంబులరను • ధ్యానంబుంగఁ జల్ప భీ
కర రూపంబున పుట్టికంచుకముతో • స్తాన్నప్పైప్రవేశించి తో
స్థిర! శ్రీజమ్ములమడ్క మందిర యశ • శ్శ్రీ! ఆంజనేయప్రభూ! 13

మ॥ ఉదయాస్తాద్రులపైన నిశ్చలత ది • వ్యోద్రేకతన్ వే భవ
త్పదయుగ్మంబు నునిల్పి మిత్రుఁ గురుగా • భావించి శాస్త్రంబులన్
జదువన్ గల్గితి వేమి సీనుహేమ వి • శ్వస్తుత్య పాదా! శుభ
ప్రద! శ్రీజమ్ములమడ్క పూర్వరవిహా • రా! ఆంజనేయప్రభూ॥ 14

శా॥ ఏయే జన్మములన్ ధరించితినో నే • నేపాపముల్ చేసి నా
నో యీనాఁటికిఁ దప్పలేకునికి నెం • తో కష్టముల్ గల్గె నా
న్యాయాన్యాయములన్ గ్రహించగదవ • న్నాన న్నిట్లు యున్నాను స
ద్గేయా! జమ్ములమడ్క మందిర కృపా • బ్ధీ ఆంజనేయప్రభూ! 15

మ॥ సరిగా వేల్పులు లేనివారు ఘనవ • ర్ణంబుండినన్ పంపకే
ధరపైనిల్చినవైరు మృణ్మయముగా • దంభహ్యవహా నిరుని
స్మరణన్ జేయని నోరు సజ్జనులకున్ • సంతోషముం గూర్చునే
ధరలో జమ్ములమడ్క వాసహితమో • దా ఆంజనేయప్రభూ! 16

మ॥ సరిగా లేవని బంతి యుద్ధధరణిన్ • జాకొడుచెదంతి యు
క్కుంఠనున్ నేర్వని శాంతి కానిదగు • శుష్కభ్రాంతి యాహాపమో
ధరముల్ గల్గని యుంతి నిన్నరయకే • దాందాల్చుసతాక్కంతి సం
కరముల్ జమ్ములమడ్క పూర్ణిలయరత్మా • ఆంజనేయప్రభూ! 17

మ॥ అసిలోఁ జూపనియట్టి క్షేమము సదా ♦ హ్లాదంబుల్ మదిఁ గోరు వే
శ్మనుఁ జూపింపక యున్న కామము మహా ♦ హ్లాదంబుఁ జోనిచ్చు గో
ల్పని యానీమము లాభముం బొనఁగొదే ♦ వా భక్త కల్పద్రుమా
అనఘా జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ! 18

మ॥ సభలన్ లేవని నోళ్ళు యాత్రలుగనన్ ♦ సంచారమున్ జేయకే
విభవంబుం బెంపు కాళ్లు కన్పనిడకే ♦ వేయించు పందిళ్ళు స
ద్విభు నిన్నిల్పని గుళ్ళుం గాభమెక్కసా ♦ భూవ్యర్థముల్ సూర్య స
న్నిభ శ్రీజమ్ములమడ్క పూర్ణిలయ తం ♦ డ్రీ ఆంజనేయప్రభూ! 19

మ॥ మధురంబౌ ననిపండ్లు చెట్టములు రా ♦ మర్యాద లేనిండ్లు వా
క్సుధలన్ జిమ్మక యున్న నోండ్లు పువ్వులన్ ♦ గోయంగ లేనట్టి వ్రేం
డ్లు ధరన్ గొల్వని చేయి జోండ్లు తలుపన్ ♦ లోకంబునన్ వ్యర్థముల్
విధిగా జమ్ములమడ్క మందిరయశ ♦ శ్రీ ఆంజనేయప్రభూ! 20

మ॥ సరుకుల్ గల్గక యున్న కొట్లు విగత ♦ త్రాణ జంబు నౌగట్లు సా
దరమున్ లేనటువంటి పెట్టుపలుకుల్ ♦ దీపించనౌ శెట్టునిన్
స్థిరతన్ నిల్పనినట్టు మాండగయశశ్రీ వ్యర్థముల్ గాదయా
కర శ్రీజమ్ములమడ్క వాస ♦ నతరక్షా ఆంజనేయప్రభూ! 21

మ॥ పదునున్ దాల్పని కత్తిముట్టినను ♦ దహంబుండనౌ వత్తి పెం
పొదవన్ జాలని నెత్తి మోదపడగా ♦ నూదివ్వ నొత్తి త్తిని
న్మదిలో నిల్పని బత్తి చూడగ మహా ♦ త్మా వ్యర్థముల్ వ్యర్ధముల్
గద శ్రీజమ్ములమడ్క పూర్ణిలయరక్షా ♦ ఆంజనేయప్రభూ॥ 21

మ॥ బరువున్ సైచని బండ్లు నందమిడనౌ ♦ పాలిండ్లు నే వేళన
క్కఱకున్ రాలినయుండ్లు పారులు చెడన్ ♦ గాన్పించు వాకిండ్లుని
న్నరయన్ జాలని కండ్లు వ్యర్ధములు గా ♦ వా రామభక్తా! కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క మందిర నివా ♦ సా ఆంజనేయప్రభూ॥ 22

మ॥ ఆరోగ్యంబిడనట్టితావి జనమ ♦ త్యానందముం జెందగా
నీరంబు డవిబావి కెంపుకళ యెం ♦ తేలేని కెమ్మోవియా
చారంబూనవిశైవి నిస్తలుపనో ♦ ఛందాలునిం తావి యా
వేరే జమ్ములమడ్కమందిర! యశ ♦ శ్వీ! ఆంజనేయప్రభూ! 24

మ॥ కలుకుల్గల్గిన బాటవేగస్ఫురితినై ♦ క్యాంబాదనో పాటయ
క్కలుకుల్ మాంలిస డబ్బుమాట జనమా ♦ కాంక్షింపనో మాటనీ
స్మరణజ్ఞేయుసిపూటవ్యర్థము కపీ ♦ శా! రామభక్తా! కృపా
కర! శ్రీజమ్ములమడ్కవాస! సతర ♦ తూ! ఆంజనేయప్రభూ! 25

మ॥ పరులన్నిల్పనికోట పుష్పఫలముల్ ♦ భాసిల్లనో తోట సం
బరముల్ నల్లనిమాట హేమ్బుతనుగుల్ ♦ వర్ణింపనో కాటనిం
స్థిరతం నిల్పనిపేట వ్యర్థముయశ ♦ శ్వీ! వాయుపుత్రా! పరా
త్పర! శ్రీజమ్ములమడ్కమందిర! మహా ♦ త్మా! ఆంజనేయప్రభూ! 26

మ॥ సమయంబందున లేనిమైత్రిపతితో ♦ సంభాషణల్ లేక తం
త్రిముతో నుండెడి దివ్యగాత్రిగత జ్యో ♦ త్స్నసూత్రమహా గ్రాసీ
మముతోఁ బెట్టనిపత్రి యొందుకుమహా ♦ త్మా! లాభమే లేకవ్య
ర్థములౌ జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 27

మ॥ బలముల్ గల్గకయున్న కండయడవిం ♦ భాసిల్లు కేయొండ ని
శ్చలతన్ బ్రతని తండ తావియనవీ ♦ సంబుందుఫ్రాదండ ని
న్నిలుపజ్ఞాలనియుండ మోదమిడుచున్నే ♦ దేవ! పాపాటవీ
జ్వలనా! జమ్ములమడ్కవాస నతర ♦ తూ! ఆంజనేయప్రభూ! 28

శా॥ ఏకార్యంబులఁ జేయఁ భూమిపయికీ ♦ వే తెంచియున్నాఁడవో?
యాకార్యంబులఁదీర్ప నీహృదయం ♦ దాలోచనజ్జేసి దే
వా కిష్కింధకుఁ జేరి వానరుఁడనం ♦ వర్తించితౌ చిత్రమా
నా కో జమ్ములమడ్క పూర్ణిలయ అ ♦ న్నా! ఆంజనేయప్రభూ! 29

శా॥ నీరూపంబును నీమహామహిమము ♦ న్వీక్షించి సంతోషమే
పారన్వాలియు సూర్యపుత్రుఁడమలా ♦ ప్తా! "రమ్మురమ్మం"చుని
న్జేరన్డీసిరి యండమాకనుచు తం ♦ డ్రి! రామభక్తా! సదా
చారా!జమ్ములమడ్క-మందిరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 30

మ॥ ఎదియోవిద్య గ్రహించుమాత్రమున మా ♦ కీ కేఁడులోకాలలో
నెనరెవ్వారలటంచుఁ బల్కదురు తం ♦ డ్రీ కొందరజ్ఞానుల
య్యాది నీమానసమందుఁగానఁబడద ♦ య్యా! చిత్రమౌహా? శుభ
ప్రద!శ్రీజమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 31

శా॥ కీశాధ్యక్షుఁడు వాలి తమ్ముఁడగు సు ♦ గ్రీవున్ మహాక్రోధుఁడై
తా శక్తిన్ విదళించి కొట్టితరుమన్ ♦ ధర్మంబువీక్షించి యా
యాశన్వేడి ప్రభాకరాత్మజునితో ♦ నద్రిన్ బ్రవేశించితో
యీశా! జమ్ములమడ్క-మందిర! కృపా ♦ బ్ధీ! ఆంజనేయప్రభూ: 32

శా॥ సీతన్గాంచక లక్ష్మణానుజునితో ♦ శ్రీరామచంద్రుండుని
ర్ఘాతారణ్యములన్ గలంచుచునురా ♦ గా రుశ్యమూకాద్రికిన్
చేఁతోమోదముతోఁడ వారిపదముల్ ♦ సేవించితౌ భక్తి వి
ఖ్యాతా! జమ్ములమడ్క- పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ!33

శా॥ వాలిన్జంపగ రామచంద్రునిమహా ♦ భక్తిన్విలోకించి భూ
పాలా! యాజ్ఞయునంగ ముద్రికనిడన్ ♦ వారాన్నిధిన్ దాటినీ
వాలంకాపురి యొద్దుజేరితివిగా ♦ దాదేవ! పాపాటవీ
జ్వాలా జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా ఆంజనేయప్రభూ। 34

మ॥ సురలెల్లన్భవదీయశక్తిమహిమ న్జూడంగలోనెంచి వే
సురసన్బంపగ యామెవచ్చినిలువన్ ♦ శూరత్వమున్ జూఁపుచున్
చిరుఁతాకారమునూని నోటఁజొరి వి ♦ చ్ఛేదంబుగాఁ జేయు భీ
కరశ్రీ జమ్ములమడ్క-పూర్ణిలయర ♦ తూ! ఆంజనేయప్రభూ॥ 35

మ॥ అలలంకాపురిఁ జేరుమార్గమున ఘో♦రాకారయుక్తాలంక తా
నిలువన్ లెమ్మని చెప్ప ఖడ్గమున ని♦న్నే కొట్టనూహింప ను
జ్వలశౌర్యంబున గుద్ది వేఁడ విడిపో♦వన్ జూచి తేయో భవ
జ్వలనా! జమ్ములమడ్క పూర్వ్వరనివా♦సా! ఆంజనేయప్రభూ॥36

మ॥ ధరణీజాతనుఁ జూతునంచు కడుమో♦దంబందుచున్ లేచి మం
దిరముల్ వీధులు స ద్గృహంబులును నె♦ తేమాచియాఁ జానకీ
తరుణీరత్నముగానరామి మదిఖే♦దంబూనినావో శుభ
స్కర! శ్రీజమ్ములమడ్క పూర్వ్వరనివా♦సా! ఆంజనేయప్రభూ॥ 37

మ॥ అలుకన్ద్రాలిచి లేఁచిపై కెగసి సూ♦ర్యాకార! యంతఃపురం
బులలోఁ జూఁచుచు భర్త్రలగ్గలియునా♦ పూబోండ్లవీక్షించి "హా"
కలుషంబాచుఁ దలంచి యెట్టులగునీ♦ కార్యంబటంచెంచి చిం
తిలితే! జమ్ములమడ్కమందిర! కృపా♦బ్ధీ! యాంజనేయప్రభూ॥38

మ॥ మదిలోఁ గుట్రినుఁబూని చూడఁగదరా♦మా! పాపమెట్లౌను నే
నిదియేపో యెదనంచు లేఁచి యచట♦న్వీక్షించి పైకేగి చూ
చి దశాస్యుండుఁబరుండు చోటుఁగని మా♦సీతమ్మయంచెంచితే
మదిలో జమ్ములమడ్కమందిర! మహా♦త్మా! ఆంజనేయప్రభూ!39

మ॥ పొరపాటందితి మందబుద్ధినయి హా♦ పూబోణిసీతమ్మ యీ
దురహంకారుని సాధ్వమానెయని♦ యెంతో దీనతన్ జూచి వా
హ్వారె మండోదరి యంచుమోదపడినా♦వా? చిత్రమయ్యా! కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్కమందిర నివా♦సా! ఆంజనేయప్రభూ! 40

మ॥ ఇకమాసీతమ నెందుఁగందునని కా♦నీయంచు వేలేచి పా
యక నుద్యానవనంబులన్ దిరిగి య♦మ్మా! కానగారమ్ము నీ
వకటా యెందుననుంటివంచు వడిగాఁ♦ బ్రార్థించినావయ్యా! ర
క్షక! శ్రీజమ్మలమడ్క పూర్వ్వర నివా♦సా! ఆంజనేయప్రభూ!41

మ॥ ఒకవృక్షంబునఁ గూరుచుండి కనియో ♦ హా! తెల్లవారెన్నఁడా
యిఁక నెట్లంచు రఘూద్వహుం దలఁచి తం ♦ డ్రీ! యంచు వీక్షించ నా
యకలంకాత్ముని దేవి కన్పడఁగ నా ♦ హ్లాదుండ వైనావు ర
క్షక! శ్రీజమ్మలమడ్క-మందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 42

మ॥ అకటా! శుష్క-శరీరయై దిగులుతో హా ♦ "రామ హా రామ" నా
యక! నిన్నెప్పుడు జూఁతునో యనెడి యా ♦ యమ్మన్ విలోకించి సి
యకళంకంబగు ప్రేమఁ జూపితివి గా ♦ దా వందనం బంచు ర
క్షక! శ్రీజమ్మలమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 43

శా॥ ఆపై రావణుఁ డేగుదెంచి కసి కాం ♦ తా! నన్నుఁ బెండ్లాడు మా
నీపైఁ బ్రాంతిజనించె నన్న విని యా ♦ నీరేజపత్రాక్షి ఛీ
ఛీ పాపాత్మున నాలకించితివి యిప్పీ ♦ యంచు చింతించి యో
పాపా! జమ్మలమడ్క- పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 44

మ॥ సమయంబెప్పుడు వచ్చు నీకుమతిన్ ♦ జక్కాడగానంచు రా
ద్రిముతోఁ జూచుచు రావణుండు వెడలన్ ♦ రామాయణం బెల్ల భూ
జముపైనుండి సుసాధ్వి జానకి వినన్ ♦ సాంగంబుగా దెల్పితో
విమలా! జమ్మలమడ్క-మందిర యశస్వీ ♦ ఆంజనేయప్రభూ॥ 45

శా॥ సీతన్ జూడఁగ చెట్టుడిగ్గి జననీ! ♦ శ్రీరాముబంటున్ మహా
భీతిన్ జెందెదు రామమూర్తిపనుపన్ ♦ వీక్షించగావచ్చి నే
నేతీరోకనుఁగొంటి చూఁడుమికయి ♦ ద్దే యూనవాలన్న వి
ఖ్యాతా! జమ్మలమడ్క-పూర్వర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 46

మ॥ కనిసీతామణి యూనవాలునకటా ♦ కన్నీరు మున్నీరుగాఁ
గను చింతించి కపీశ రాఘవులకున్ ♦ గళ్యాణమేయన్న యా
వనితన్ దుఃఖము వీడజేసి పతియా వ ♦ ద్వృత్తమున్ దెల్పితో
యనఘా జమ్మలమడ్క-పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 47

మ॥ భయముఁ జెందకుమమ్మ! రాఘవుఁడు శుం ♦ భత్ప్రేషితో వచ్చి ది
గ్జయుఁడై రావణునిన్ వధించి విమల ♦ సాధ్వీతన్నున్ గాంచు వే
బయలుర్ దేరును పోయివత్తునని యా ♦ పైయాజ్ఞఁ గొన్నాఁడ వ
వ్యయ! శ్రీ జమ్ములమడ్క పూర్వగవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 48

మ॥ ఫలముల్ భక్షణఁ జేతు వాజ్ఞ నిమ్మం ♦ బా! యంచు వేకోరుచున్
జలజాతాన్వితవృక్షయుక్త వనముల్ ♦ జక్కాడి వారించు కా
వలకాండ్రన్ వధియించి మించితివి శుం ♦ భత్సౌర్య! పాపాటవీ
జ్వలనా! జమ్ములమడ్క పూర్వగనివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 49

శా॥ రూఢిన్ వచ్చుచునున్న యక్షయకుమా ♦ రున్ జంపి సైన్యావళిన్
గాఢంబొప్పఁగఁ గూల్చి రావణుని వే ♦ కాంచన్ కరంబెంచి యున్
రాఢారూఢిగ నేయు నింద్రజితు శ ♦ స్త్రజ్వాలకున్ వీడి తౌ
ప్రౌఢిన్ జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 50

శా॥ ఆపై రావణుఁ జేర్చి నిన్నుఁ గని రౌ ♦ ద్రాకారుఁడై క్రోధించి తా
కోపోద్దీప్తుఁడై మహాకుటిలుఁడై ♦ కోదండఖడ్గంబులన్
నీపైఁ జూపఁగ రాఘవేంద్రు మహిమన్ ♦ వీక్షింతువాయన్న స
త్ప్రపా! జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 51

మ॥ అకళంకాత్మ నినిన్నుఁ జూచి భటులా ♦ రా! యిప్పుడీకోతితో
కకు నిప్పుల్ తగిలించుడంచనిన యా ♦ క్రూరాత్ములంటించ వీ
డకలంకాపురి గాల్చివేసితివి గా ♦ ఢంబొప్పఁగా సర్వర
క్షక! శ్రీ జమ్ములమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 52

మ॥ మరలన్ సీతనుగాంచి మోదపడి అ ♦ మ్మా! ధీరుఁడై రాఘవే
శ్వరునిన్ జేరెద నాజ్ఞనిమ్మనుచును ♦ త్సాహంబుతో లేచి సా
గరముల్ దాటి ముదాన రాఘవుల వే ♦ గన్నాఁడవా యోకపీ
శ్వర శ్రీ జమ్ములమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 53

శా॥ ఈవృత్తాంతముఁ దెల్పి రాఘవులతో ♦ నేతెంచి వారాన్నిధిన్
వే వేగమ్మున దాటి రాక్షసులకున్ ♦ వెన్నివ్వ కేపోరి నా
వా వాహ్యా భవదీయశక్తి నెవరున్ ♦ వర్ణింపలేరయ్యా స
ద్భావా! జమ్ములమడ్క-పూర్ణిలయదే♦వా! ఆంజనేయప్రభూ! 54

మ॥ గదచేదాలిచి రాక్షసప్రవరులన్ ♦ గంభీరతన్ గొట్టి నీ
పదసంఘట్టనచేత దానవతతిన్ ♦ పాతాళమున్ జేర్చి స
మ్మదమున్ గూర్చితి రాఘవేశ్వరులకున్ ♦ ముఖ్యంబుగా యో శుభ
ప్రద! శ్రీజమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 55

మ॥ తలలన్ గోయుచు సైన్యమున్ జెరచుచున్ ♦ దర్పించుచున్ గాఢని
శ్చలబాహాబలమొప్పగా తిరుగుచున్ ♦ శౌర్యానలంబున్ మహో
జ్వలతన్ లేపి విరోధిసైన్యవన వై♦శాల్యంబులన్ గాల్చితో
లలితా! జమ్ములమడ్క-భక్తపరిపా ♦ లా! ఆంజనేయప్రభూ॥ 56

శా॥ రక్తంబెల్లడఁ బారకాల్వలయి భీ ♦ రత్వంబునన్ రాక్షస
వ్యక్తుల్ కేకలుఁ బెట్టిపార తలలా ♦ హాగుట్టలై రాలగా
శక్తుల్ తద్రుధిరంబు త్రాగి యెగురన్ ♦ సర్వంబు చూపించితో
శక్తిన్ జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 57

మ॥ తనుశక్త్యాయుధమేయ వేటవేసుమి ♦ త్రిసూతిమూర్ఛిల్ల యా
తనిగొంపోవగ లేవనెత్తునసురున్ ♦ ధైర్యంబుతో తన్నిక్రిం
దను బోర్లించితి వేమి నీమహిమ ♦ యుద్యచ్ఛక్తి నీదేకదా
యనఘా జమ్ములమడ్క-పూర్వరవిహా♦ రా ఆంజనేయప్రభూ॥ 58

మ॥ అనుజుండాగతి మూర్ఛనొంద సకటా ♦ "హా"యంచు చింతిల్లియా
యిన వంశాగ్రణి దుఃఖమంద వడిగా ♦ నేతెంచియాజాంబవం
తుని వాక్యంబున నోషధిన్ వెదకగా ♦ ద్రోణాద్రికిన్ జేరి నా
వనఘా జమ్ములమడ్క-పూర్వరవిహా♦ రా! ఆంజనేయప్రభూ! 59

శా॥ కాసారంబున నీరుఁ ద్రాగఁ దిగ న♦క్రంబొండు నిన్ బట్టినా
హాసత్త్వమ్మున యుద్ధమున్ జలిపి దీ♦వ్యత్తేజమున్ నీవుచున్
నీసత్త్వంబున గర్భమంటఁ జొరియున్♦వేధించితౌ సంస్కృతా
భ్యాసా! జమ్ములమడ్క-పూర్వరవిహా♦రా! ఆంజనేయప్రభూ! 60

శా॥ ఆనక్రింబును దున్మి దివ్యమతి ద్రో♦ణాగ్రిన్ విలోకించి యే
మైనన్ ఓషధి కానరామిఁ గిరినిన్♦ హస్తంబునన్ నిల్పి వ్యో
భానుం డుద్భవ వాటనున్ మునుపు ని♦వ్యంబొప్పగా దెచ్చి తో
జ్ఞానా! జమ్ములమడ్క-మందిరనివా♦సా! ఆంజనేయప్రభూ! 61

మ॥ గిరిఁ గన్నంతనె సంతసంబొదువనీ♦ కేల్బట్టి రాముండు సు
ఘ్రథకుండవు నీవె నీ నెయనుచున్♦ శ్రీమీరదీవించి స
ద్వరముల్ నీకునొసంగడే సుగుణుడై♦ తమ్ముండు లేవన కపీ
శ్వర! శ్రీజమ్ములమడ్క-మందిర నివా♦సా! ఆంజనేయప్రభూ॥ 62

శా॥ ఆ రాముండు దశాస్యునిన్ మరియు భృ♦త్యామాత్యులన్ గూడ సం
హారంబున్ బొనరించి సీతగనియో♦ యబ్జాక్షి గోనేను నిన్
జేరన్ సందియమన్న నగ్ని బడ ని♦స్సీయంచు చింతించినా
వారా! జమ్ములమడ్క పూర్వర విహా♦రా! ఆంజనేయప్రభూ! 63

మ॥ అనలుండా మహిజాత సీతగొని రా♦మా! సాధ్వినీ సీతఁ గొ
మ్మన సంతోషముఁ జెందె కౌఁగిలిడవా♦హా యంచు స్వాంతంబునన్
పనియెల్లన్ నెరవేరెనంచు ననలున్♦ బల్మారు ప్రార్థించినా
వనఘా! జమ్ములమడ్క-పూర్ణిలయ దే♦వా! ఆంజనేయప్రభూ॥ 64

మ॥ పరమానందముతో విభీషణునకున్♦ పట్టంబు గట్టన్ మహా
కరుణన్ సాయము జేసి నీపణిన వే♦డ్కన్ రామునిన్ లక్ష్మణున్
ధరణీజాతను నిల్పి వారలనయో♦ధ్యన్ జేర్చినావో కపీ
శ్వరశ్రీ జమ్ములమడ్క-పూర్వరనివా♦సా! ఆంజనేయప్రభూ! 65

మ॥ సుమవర్షంబులతోడ నిర్జరవరుల్ ♦ స్తోత్రింపశ్రీరామ నా
మముఁబౌరుల్ గొనియాడ భూపతులు సం ♦ ప్రార్థింప పట్టాభిషే
కముఁ జేయించుకొనంగ రాముఁడు మహా ♦ కారుణ్యుఁడైయిచ్చె పా
దములన్ జమ్ములమడ్కమందిర! మహా ♦ త్మా! ఆంజనేయప్రభూ! 66

మ॥ ఎటరాముండువసించునో రఘుకులుండె ♦ చ్చోటమాట్లాడునో
ఎటరామాయణముండునో యటకునీ ♦ వేతెంతు వెల్లప్పుడన్
బటుబాహాబలమొప్ప భక్తిగదురన్ ♦ ప్రార్థించుచున్ నిల్తువ
చ్చట శ్రీజమ్ములమడ్క పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 67

శా॥ నీపాదంబులఁగొల్చుమాత్రమున నెం ♦ తేపుణ్యమబ్బున్ గదా
పాపంబెల్లను పారిపోవును గదా ♦ బల్ మోదమొప్పారను
ద్దీపించున్ గద విద్యలెల్లను కృపా ♦ బ్ధీ! రామభక్తా! జన
ప్రాపా! జమ్ములమడ్క పూర్వర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 68

శా॥ నీరూపంబును జూచినంతకనులన్ ♦ న్నీనామమాలించినన్
వారున్ భూతములెల్లభీతివడి నీ ♦ బాహాబలంబెన్న నె
వ్వారున్ జాలరు నేనుమాత్రము నినున్ ♦ వర్ణింపశక్తుండనే
ధీరా! జమ్ములమడ్క మందిర కృపా ♦ బ్ధీ! ఆంజనేయప్రభూ! 69

శా॥ సంతానంబనినిన్ను జేరి సతమున్ ♦ సాధ్వీశిరోరత్నముల్
భ్రాంతిన్ నీకు ప్రదక్షిణంబులిడుచున్ ♦ ప్రార్థించి వేడంగ నా
కాంతల్ సంతసమంద సంతతిని వే ♦ డ్కన్ గూర్చి నావయ్య సు
స్వాంతా! జమ్ములమడ్క పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 70

మ॥ అనిజేయన్ గమనించు కాలమున క ♦ ళ్యాణంపు వేళన్ వడిన్
ధనసంపాదనకేగునప్పుడెదనిన్ ♦ ధ్యానించినన్ సౌఖ్యమ
బ్బును సంపాదనగల్గు దేశములన ♦ భ్యుత్థానముల్ గల్గునో
యనఘా! జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా ఆంజనేయప్రభూ॥ 71

మ॥ నిను ధ్యానించెడి భక్తులున్న స్థలము ♦ వీక్షించుమాత్రంబునే
కనులన్ జేసెడి పాపమెల్ల తొలగున్ ♦ గంభీరమై జన్మ పా
వనమున్ గల్గెడి యేమి నీ మహిమ యన్ ♦ పాలింపవే పాపసం
హననా! జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 72

మ॥ ఘనవేదాంతులమంచు చేయివిడకన్ ♦ గంజాయిబుట్టన్ క్షణ
క్షణమున్ బీల్చుచు శిష్యులన్ బిలచి మో ♦ క్షంబిత్తుమాచాయుచున్
ధనధాన్యంబులసంగ్రహించెదరుగా ♦ దా కుశ్చితుల్ గారె వా
రనఘా! జమ్ములమడ్క మందిర విహా ♦ రా! ఆంజనేయప్రభూ॥ 73

మ॥ వినుతుల్ బొందుచుచున్న మాత్రమున నే ♦ వేదాంతులైయ్యందు రే
యనఘస్వాంతులమన్న మాత్రమున నా ♦ హా మోక్షమున్ గల్గునే
తనుతా నెవ్వరో యోజనన్ జలుపు లే ♦ తత్వంబుగాదా మహా
స్వన శ్రీజమ్ములమడ్క మందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ॥ 74

మ॥ పరిశుద్ధాత్మను బొందలేకను "నహం ♦ బ్రహ్మోస్మి" యన్నన్ మహా
గురుపట్టంబును గట్టుకొన్న సిసులన్ ♦ గూర్పెట్టి బోధించినన్
సరియౌ మోక్షము గల్గునే సతమునిన్ ♦ సంస్తోత్రమున్ జేయకే
స్థిర శ్రీజమ్ములమడ్క మందిర! యశ ♦ శ్వీ! ఆంజనేయప్రభూ: 75

మ॥ అనఘాత్మా! రిపుశంకరాభరణ తా ♦ క్ష్యా! భైరవీనాథ సం
జనితా! యాశ్రిత చక్రవాకరవితే ♦ జా! మోహనాకార! నీ
వనురాగాత్ముండవౌట నేనెఱిగి త ♦ య్యా! నమ్మితిన్ ప్రోవుమా
నను శ్రీజమ్ములమడ్క వాస! కపిచం ♦ ద్రా! ఆంజనేయప్రభూ॥ 76

శా॥ ఆనందాంచిత! వాయునంద ప్లవం ♦ గాధీశ! సౌమ్యాంగ సు
జ్ఞానాత్మా! విజయధ్వజా! భవవినా ♦ శా! విక్రమ స్థైర్య! దే
వా! నిన్వర్ణన జేయవత్సరములౌ ♦ నాలోచనల్ జల్ప నా
కౌనా! జమ్ములమడ్క పూర్వర విహా ♦ రా! ఆంజనేయప్రభూ! 77

శా॥ ఆదిత్యప్రియశిష్యయో ప్లవగస ♦ మ్రా! మంగళాకార! దే
వాదాక్షిణ్యకళాధర! బుధ! గురు ♦ ధ్యానాత్మ! పాపవళి
చ్ఛేదా నీశుభవారమున్ బరిపి ర ♦ క్షింపంగదే నాపయిన్
న్వాదా జమ్ములమడ్క-వాస! కనరా ♦ వా! ఆంజనేయప్రభూ!78

శా॥ వీరా! పాపవిదూర! ధీర! సుకరా ♦ విశ్వాత్మ! యోధష్ట సం
హారా! భక్తమనోవిహార! సుమహా ♦ రా! సుందరాకార! యో
పారావారగభీర నన్ కరుణతో ♦ పాలింపుమయ్యా! సదా
చారా! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ! 79

శా॥ చిత్రాచిత్ర చరిత్రపావనయశ ♦ శ్రీపాప ప్రైత్రామహా
పాత్రా! భీకరయుక్తగాత్ర! కరుణా! ♦ పాథోనిధీయంజనీ
పుత్రా! పాపమయాంధమిత్ర! వడిగా ♦ పోషింపుమా భక్తస
న్మిత్రా! జమ్ములమడ్క-పూర్ణనిలయ స్వా ♦ మీ! ఆంజనేయప్రభూ 80

శా॥ ఈమాయాన్వితమౌ ప్రపంచమున తం ♦ డ్రీ! పుట్టియున్నాను నీ
ప్రేమన్గాంచ ప్రతిజ్ఞబూనితిని న ♦ న్వీక్షించి రక్షించవే
నీమాహాత్మ్యము నెన్నగానలవియే ♦ నిష్కామ్య నిర్ధారణా!
స్వామీ! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ!81

శా॥ కామంబున్ విదళించి నిశ్చలుడవై ♦ కైవల్యమున్ గోరి శ్రీ
రామున్ సీతనుజేరి నేడగని పు ♦ త్రార్థమ్ము రమ్మంచు స
త్ప్రేమన్ వేదరహస్యముల్ దెలుపరే ♦ వేదాంతమున్ జూపరే
స్వామీ! జమ్ములమడ్క-పూర్వరనివా ♦ సా! ఆంజనేయప్రభూ!82

శా॥ జంటన్ బాయక రామమూర్తిపద కం ♦ జాతంబులన్నమ్మి మూ
డింటిన్ ఖండనజేసి యాపయిన నై ♦ దింటన్ విడన్ గొట్టి యా
రింటిన్ ముట్టక యేడిటిన్ వదలి ది ♦ వ్యేచ్ఛన్ గనన్ గోరి తౌ
యొంటిన్ జమ్ములమడ్క-వాస! జితమృ ♦ త్యూ! ఆంజనేయప్రభూ!83

శా॥ నేనే నీవను తత్త్వమున్ గనమనో ♦ నేత్రంబులన్విప్పి నీ
వానందంబునఁజూచి భ్రాంతివిడి మా ♦ యన్నింటియున్మానఁడ వ
జ్ఞానంబున్దరిఁజేర నీయకయె సూ ♦ క్ష్మస్థాన దివ్యత్కళా
ధ్యానా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 84

మ॥ గురుఁడే శిష్యుఁడు శిష్యుఁడే గురుఁడుగా ♦ గుర్తించి శ్రీరామునిన్
స్థిరచిత్తంబుననిల్పి పావనతరిన్ ♦ ధ్యానించి సూక్ష్మైకత్రిన్
పరగన్వెల్గితి వేమినీమహిమ నన్ ♦ బాలింపవే వానరే
శ్వర! శ్రీజమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 85

మ॥ మును కీశుల్ భవదీయభక్తిఁగని స ♦ మ్మోదంబుతో రాముద
ర్శనమిప్పింపుమన న్సఖంబులను వ ♦ క్షచ్ఛేదమున్ జేసి వెం
టనె చూపించితి వెల్లరున్గొలువగా ♦ నాలోగలండంచునో
యనఘా! జమ్ములమడ్క-పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ! 86

మ॥ అనయంబున్ రఘురామమూర్తి కృపనీ ♦ యాత్మన్ వసించున్ గదా
వనజాతాక్షిని జానకిన్ గలసి ని ♦ న్వర్ణింపశక్యంబె నీ
ఘనకారుణ్యకటాక్షముల్ బరపిన ♦ న్గావంగదే యంజనీ
తనయా జమ్ములమడ్క-మందిర మహా ♦ త్మా! ఆంజనేయప్రభూ॥ 87

మ॥ మును మైరావణుఁడా విభీషణుఁడనన్ ♦ మోసంబుతో వచ్చి రా
ముని సౌమిత్రినిఁ గొంచు పోవగ బలం ♦ బున్ బెంచి పాతాళలం
కను తద్రాక్షసవర్యుఁ గూల్చి కడువే ♦ డ్కన్ రాము మెప్పించితో
యనఘా! జమ్ములమడ్క-మందిర విహా ♦ రా! ఆంజనేయప్రభూ! 88

శా॥ ఆరోగ్యంబును లేక దీనులగు వా ♦ రత్యంతమౌ భక్తితో
నీరూపంబుఁ జూచుమాత్రమున తం ♦ ద్రి సౌఖ్యమున్ జెందరే
కారుణ్యాకర దీనచిత్తుడను నన్ ♦ గావంగదే యోసదా
చారా! జమ్ములమడ్క-పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ। 89

మ॥ ధనధాన్యంబులు లేవునాకనెడి చిం ♦ తన్ వీడుచున్నాను నీ
ఘనకారుణ్యముఁ గోరుకొంటి నదియే ♦ కళ్యాణముల్ గూర్చు నా
కనుమానంబిసుమంత లేదు వినుమ ♦ య్యా నమ్మినీ దుష్టభం
జన! శ్రీ జమ్ములమడ్కపూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 90

మ॥ అకళంకాత్ముఁడ వీవు నాహృదయమం ♦ దావాసమున్ జేయుమా!
సకలంబబ్బును నాకు నిత్యమును ని ♦ స్సందేహ మీమాట ని
న్నికనేఁ గోరునదేమి యున్నయది తం ♦ డ్రీ! సర్వలోకైక ర
క్షక! శ్రీ జమ్ములమడ్కమందిర నివా ♦ సా! ఆంజనేయప్రభూ! 91

శా॥ శ్రీమంతుండగు జోగిరెడ్డియను దు ♦ ర్గెంపూడి వంశ్యుండు నీ
ప్రేమన్ గ్రాంచదలంచి సిన్నిలిపి తం ♦ డ్రీ కోవెలన్ గట్టి స్వ
గ్రామంబందున భక్తుఁడౌటనుగదా ♦ కాపాడియున్నాఁడవో
స్వామీ! జమ్ములమడ్క పూర్వర నివా ♦ సా! ఆంజనేయప్రభూ.92

మ॥ జనకుండాపని జేయ పుత్రవరులున్ ♦ సంతోషయుక్తాత్ములున్
ఘనులౌ అయ్యపరెడ్డి జోగయ మహా ♦ గంభీరమైగన్పడన్
పనియొప్పారగ సిల్పినారలుగదా ♦ ప్రాకారమాన్యాలనో-
యనఘా! జమ్ములమడ్కపూర్వర విహా ♦ రా ఆంజనేయప్రభూ॥93

మ। అరయన్ గాదెకులుండు శ్రీహనుమ రె ♦ డ్యాఖ్యుండు భక్తుండు నీ
స్మరణన్ జేయుచు కాలమున్ గడిపిమా ♦ న్యంబిచ్చె గ్రామంబునన్
జనముల్ నేటికి భక్తి నీదగు పదా ♦ బ్జాతంబులన్ గొల్తురో
యనఘా! జమ్ములమడ్క పూర్వరవిహా ♦ రా! ఆంజనేయప్రభూ॥94

మ॥ హరపుత్రాయ మహాబలాయ కపిసై ♦ న్యస్థాయ వీరాయ సం
గరభీమాయ కృపామయాయ త్రిజగ ♦ త్కళ్యాణ రూపాయ స
త్పరమాత్మాయ "నమోనమో"యనినచో ♦ పాపంబువిచ్ఛేదమౌ
ధరలో జమ్ములమడ్కవాసహిత మో ♦ దా! ఆంజనేయప్రభూ॥ 95

మ॥ జయభక్తాంబుజ భాస్కరా! జయ మహా♦ శౌర్యానలప్రోజ్జ్వలా!
జయ భూతాఖ్యగజేంద్రసింహా! జయవి♦ శ్వస్తుత్య! ధర్మాకరా!
జయ శ్రీరామపదాబ్జభృంగ! జయ భా♦ స్వద్బ్రహ్మచర్యవ్రతా!
జయశ్రీ జమ్ములమడ్క-పూర్వరనివా♦ సా! ఆంజనేయప్రభూ! 96

మ॥ కరుణాసాగర! పాహిపాహి సతర♦ క్షా! పాహి శ్రీయంజనీ
తరుణీపుత్రక! పాహిపాహి భవశై♦ త్రా! పాహియో రామభూ
వర భక్తాగ్రణీ! పాహిపాహి బుధ! భ♦ వ్యాపాహి దేవాకృపా
శరధీ జమ్ములమడ్క-పూర్వగనివా ♦ సా! ఆ జనేయప్రభూ॥ 97

మ॥ దిశభూతాశహిమాంశు సంఖ్యలను♦న ద్దీపించు శ్రీశాలిహా[1858]
హ శకాబ్దంబున కర్మలోకసిద్ధి చంద్రా♦ ఖ్యన్ బ్రకాశించు[1936]
హాయా ణశకాబ్దంబున ధాతవత్సరమున న్♦ చైత్రాదిం సంపూర్తి స
ద్యశ! శ్రీ జమ్ములమడ్క- పూర్వరవిహా♦రా ఆంజనేయప్రభూ॥98

మ॥ సతతంబెవ్వరు నీపదద్వయిని హ ♦ ర్షస్వాంతులై కొల్చి యీ
శతకంబున్బఠియింతురో కనుచునై ♦ శ్వైర్యంబులన్ గూర్చి వా
రతిమోదంబుననుండ జేయగద వ ♦ య్యా నీయశఃకాంతి శా
శ్వతమా జమ్ములమడ్క-మందిర నివా♦ సా! ఆంజనేయప్రభూ॥ 99

మ॥ నినుమున్నేనుతియించినానుగద తం ♦ డ్రీ! నావివాహంబు నీ
ఘనకారుణ్యముతోడ జేయుమని వే ♦ డన్ స్వస్తుల్ జేరి యీ
పనిజేయంగదె నమ్మియుంటినికదే ♦ వా! భక్తకల్పద్రుమా !
అనఘా జమ్ములమడ్క-పూర్వర విహా♦ రా! ఆంజనేయప్రభూ! 100

మ॥ వరదా! మంగళ మూర్య! మంగళముదే ♦ వా! మంగళంబో కపీ
శ్వర! వేదాంతవిచార! మంగళము ర ♦ క్షా! రామభక్తా! మ
హేశ్వర వీర్యోద్భవ! మంగళంబిదియె ♦ విశ్వస్తుత్యపాదా! దయా
శరధీ! జమ్ములమడ్క-పూర్వర నివా♦ సా! ఆంజనేయప్రభూ॥ 101

## శ్రీ ఆంజనేయస్వామి భజనకీర్తనలు.

కమాచి—రాగము

ఓ యాంజనేయ ప్రభూ! । పాహి! పాహి ॥ యో॥

అ॥ పయాంక నీపాదా । పద్మములనుదలతు
మాయారారోగ్యైశ్వ । ర్యాభివృద్ధిని జేయు॥ మోయా॥

(1) కరుణాసాగరధీవరా! భక్తాధారా । కలికల్మషసంహారా!
శరణాగతత్రాణ । బిరుదాంకితుడవని
నెరనమ్మినాము మా । దురితములణపుమ॥ హోఆ॥

(2) శరధినిదాటినావు లంకాపురి । జానకిగాంచినావు
తరయానెభవదీయ । చరితంబువర్ణింప
వరదా! రామభక్తా!। పరమపవిత్రాంగ॥ యో॥

(3) సంజీవితెచ్చినావు । రఘుకులుండైన। సౌమిత్రిని లేపినావు
రంజనహృదయ భవ । భంజన పరమాత్మ!
అంజనీదేవి గ। ర్భాంబుధి కళానిధి ॥ యో॥

(4) అన్నా యాశ్రితావత్సలా। నమ్మినవార। మన్నాయాశ్రితవత్సలా
కన్నెకంటి భద్రకవి నేలు। దేవామము
మన్నించు జన్ముల। మడకమందిరవాస॥ శ్రీ॥

కీర్తన—కళ్యాణి.

వీరాంజనేయప్రభూ! పాహిపాహి ॥ వీ ॥

అ॥ పారావారాగభీర । పరమభక్తాధారా
శ్రీరామపదపద్మ । సేవాధురంధర

మి॥ శూరవర బ్రహ్మచర్యవ్రత । క్రూరహర నిఖిలాగమస్తుత
తారహారయశ ప్రభాసువి । చార లోకవిహారాధీరా॥ వీ ॥

(1) శరధినిలంఘించియు వేగమెలంకా । పురిజేరనూహించియు
సురలునీమహిమను । నరయసురసనుబంప
దరిజేరియామెను । దర్పమున మించుచు

మి॥ కరఘాతమున వేగలంకను । ధరణిపైబడజేసి ధరణిజ
నరసిలంకనుగాల్చి రాక్షస । వరులనుగ్గాడినమహాత్మా॥ వీ ॥

(2) వడిగారాముని జేరి తాను । సంతసమొప్ప పడతివృత్తము దెల్పియు
కడు వేడ్క వారిధి । గట్టి యందరి జేర్చి
దుడుకు రక్కసులను । దునిమి రాముని జేరి

మి॥ విడువకను కన్నెకంటికులుని । వీరభద్రియ నేలుచుండెడి
యొడయడా రారమ్మజమ్ముల । మడకపూర్వరనిలయసదయా ॥ వీ॥

కీర్తన.

నరవరులారా కపి శేఖరుని । ఆంజనేయుపాద
సరసిజముల నాశ్రయించుడి । సౌఖ్యములుగనుడి ॥ న ॥
అ॥ పరమపవిత్ర చరిత్రుడు భక్తాగ్రణి । భవజైత్రుడు
వరదుడు నిశ్చలచిత్తుడు । కరుణాకరుడవ్యయుండు ॥ న ॥

(2) ఈతనినమ్మినవారికి యేమికొరత । గలుగబోదు
పాతకముల పారద్రోలుగా । వెన్వెంటనిలచి
నీతిగలిగి రండుయమ । దూతలకును జిక్కకుండు
యేతీరునమోక్షమార్గ । మెఱుగనగునో యోజింపుడు ॥ న॥

(3) కన్నెకంటివీరభద్ర । కవి నేలినపరమాత్ముడు
సన్నుతపాదుండుగాంచుడీ । మోక్షమునుగనుడి
కన్నన యీతని జేరిన గాని । పాపములుతొలంగ
వన్నలార యీపలుకు య । థార్థమనుచు భావించుడు॥ న॥

శ్రీ వాయుపుత్రా! మహాసచ్చరిత్రా! బుధస్తోత్రపాత్రా! సుభక్తాత్మమిత్రా! మహాపాపశత్రా! కృపాత్మాపవిత్రా. విశాలప్రనేత్రా! లసద్దివ్యగాత్రా! భవన్నామమెవ్వారు సేవింతురో త్వత్పదాబ్జాతముల్ మానసంబందు సన్నిల్పి యెవ్వారు పూజింతురో వారలైశ్వర్య సంపన్నులై ధన్యులై మాన్యులై గణ్యులై వెల్గుచున్నారు పాపాళినిం దూలగా చున్నారు వేదాంతభావంబు సాధించుచున్నారు మున్నర్కవంశాబ్ధి సోముండు రాముండు దేవేంద్రునిం గాసి దేవినిం గూడి నీ భక్తికిం మెచ్చి తా స్వచ్ఛమై నిత్యమై సత్యమై వెల్గు మోక్షంబు నీ వాలోకింపగా జేయు ముఖ్యుండు రెంటిన్నివారింపుమా మూటినిం బెంపుమా నాల్గిటిం ద్రుంచుమా యైదింటిం బాధసంజేయుమా ఆరిటిం గొట్టుమా యేడిటిం పారగద్రోలుమా యెన్మిదింటిం దయం గొట్టుమా తొమ్మిదింటిం గిరం దీయుమా! సాధ్యమానన్ను వెన్నెట నా యర్థముల్ మానసంబందు హూహించి తత్త్వప్రకారంబులం జేసి యోగంబులం సాధనం జేసి శ్రీరామతత్త్వంబు సాధించి వాదించి నిష్కామ్యమై నిర్మలంబై ప్రకాశించు నా తేజముం గాంచ మూఢిన్మనోనేత్రము న్విచ్చి వీక్షించగా వెన్న సామేడు గాన్పించ సన్నంపు దిడ్డిన్వడిం దూరగా వెన్నెలల్ గాయుచుండంగ తా కిన్నెరధ్వానముం జల్లుచున్నట్టి నారీశిరోరత్నముం గాంచి మోహించి భావించి మోదాబ్ధినిం దేలి యీలోకమున్నంటిని యున్నంట కన్నింటియందుండియుం గానగారాపుగాన్పించుచున్నాడవో భక్తవర్యక్రపాధుర్య నిస్వర్ణనం జేయ నాసాధ్యమానయ్య యో బ్రహ్మచర్యవ్రతా నా మొరాలించుమా నన్ను వీక్షించి నా కోరికం దీర్చుమా ఆంజనేయా మహాకాయ యీ దండకం బెవ్వారే వేళలం పారమున్ బట్టి వల్లింతురో వ్రాతురో చూతురో వారలీలోకసంబంధ సౌఖ్యంబులం బొంది పూర్ణాయురారోగ్య భాగ్యంబులం జెంది యంత్యంబునం శుద్ధమా జ్యోతినిం జూచి నీలోన నైక్యంబునుం గాంతురో దేవ! దేవా! మహాభావ! సంపూర్ణకల్యాణచారిత్ర శ్రీ యంజనీపుత్ర! చిత్ప్రభావా! నమస్తే నమస్తే నమస్తే నమః.

మంగళమ్.